# తల్లికొఱకు ఏకమత్యమవలంబింపుడు

డాక్టరు బీసెంటమ్మగారు

"ఒక తల్లి బిడ్డలగు, ఏకము అద్వితీయమునగు ఒక భగవంతుని శక్తులు, నగు భారతమాత పుత్రులారా! మతవిషయిక, రాజకీయములగు కలహములతో నేల తల్లికి తలవంపులు చేయుచున్నారు? మీమీ పక్షములకంటె, మీ దేశము యొక్కువకాదా? మీమీ ప్రత్యేక మతములకంటె ఏకమగు మతము ఎక్కువకాదా?

మీ స్వాతంత్ర్యమునకు విరోధులుగా నుండు వారల జిత్తులకు, పన్నాగములకు మీరు తోడ్పడుచున్నారు సుమా! "ఇంగ్లీషు ప్రభుత్వము ఇండియాలో శాంతమును గాపాడుచుండక పోయినచో భారతీయులు ఒకరి నొకరు గొంతులు కోసుకొనరా! అని ప్రపంచమంతటను అనుకుచున్నారే! మీ కలహముల అనే బాకులతో తల్లికడుపు చీల్చుచు "వందేమాతరం" అని పాడిన మాత్రమున లేమిలాభము! రక్తము కారుచు గాయములతో నిండియుండు తల్లి అంగములను మీకలహములు [illegible] మీరే [illegible] బంధించు[illegible] తల్లికి యితరులనుండి స్వాతంత్ర్యము కావలె[illegible] కొరకు లేమి ప్రయోజనము! 1893 సంవత్సరమున నేను ఇండియాకు వచ్చి దిగినప్పుడు నా మొట్టమొదటి యుపన్యాసములో, "ఇండియా [illegible] పుట్టిన బిడ్డలందరి [illegible] యెడ [illegible] చెప్పవలెను" అని [illegible] 1878వ సంవత్సరమునుండి ఆమెను పరదేశీయుల బంధనమునుండి తప్పించవలెనని యత్నించుచు, ఆమెయందలి ప్రేమకై నా జీవితము, శక్తి, సంపదలను సర్వస్వమును త్యాగముచేసిన నేను, ఈ 1927వ సంవత్సరమున "ఆమె బిడ్డలే ఆమెను చంపుచున్నారేమి!" అని నా హృదయములో, పరితపించుచున్నాను. [illegible] ఋషులమీద నాకు నమ్మకము లేకపోతే [illegible] మనుష్యులగు మహానీయులు అదృశ్యులుగ లోకపరిపాలించుచున్నారను నమ్మకము నాకు లేకపోతే, ఇప్పుడును శ్రీ అగస్త్యఋషి ఇండియాను [illegible]చుచున్నాడని నాకు నమ్మకము లేనిచో పరితపించి నా హృదయమును భారతమాత పాదములకడ [illegible] నిరాశ చెందియుందును.

భారతీయులుగ పుట్టి, భారతమాతను పరదేశీ బంధములకు లోబడి యుండునట్లు చేయుట ఏల? స్వార్థములను త్యాగముచేసి పరమాత్మను ప్రాణములను అర్పణము చేయునదియే భారత హృదయమని తెలిసికొనజాలరా? తల్లికి పరాధీనము ద్రోహులగు మీరేనా?

[illegible] మీకు మాత్రము మిమ్మును [illegible] అనుచున్నది. ప్రస్తుత కాలము, ఇప్పటి దారిద్ర్యము, అజ్ఞానము అల్ప[illegible] యుద్ధములను చూచుచు దుఃఖించుచున్నది. మీ పరాధీనతయు మీ అత్యాశయు [illegible] మీ బిడ్డల కొరకైనను, ఏకము కండి. ఇంగ్లండు మీకు స్వాతంత్ర్య మొసగదని మాట యిచ్చియున్నది మీరు ఏకవాక్యమున నొక్కి అడిగినచో ఇవ్వవని చెప్పను. కాంగ్రెసు తిరిగి యదార్థముగ అఖిల భారతీయ మహాసభగ చేయుదము. కొద్ది కాలముగ జరిగిపోయిన దానిని మరచిపోదము. ఆసన్నమై యుండు భావి భాగ్యోదయమునకై ఏకమగుదము. ఇప్పుడు ఆంగ్ల పార్లమెంటు సభలో ప్రవేశపెట్టబడి యుండు బిల్లు శాసనము మీకు తృప్తి కాకపోయినట్లైతే, మరియొకటి సిద్ధముచేయుడు. 1925 సంవత్సరపు బిల్లుతో సమానముగ [illegible] భారతమాతకు స్వాతంత్ర్య మిచ్చునదిగ నుండినచో, అందరికంటె ముందు నేనే ఆ ప్రాతబిల్లును చించి పారవేచి క్రొత్త బిల్లునకు మనస్ఫూర్తిగ స్వాగతమిచ్చెదను. భారతీయులు ఏకవాక్యముగ కోరినంగాని, ఏబిల్లును చట్టము కాజాలదు. భారతమాతకు, తన స్వగృహమున సర్వాధికారము నొసంగగలదే చిత్తుకాగితమైనను, భారతమాతను ప్రేమించు సకల హృదయములును [illegible] సరే అంగీకరింతురు.

(కృష్ణా పత్రిక)

గోలకొండ పత్రిక

ప్రథమ సంవత్సర మార్గశిర శు|| ౯

శనివారము

## ఉస్మానియా విశ్వవిద్యాలయ పట్టభద్రుల సన్మానసభ

మొన్నటి దినమున మన పురోద్యానము లోని టౌనుహాలు మందిరమందు గతవత్సరమున ఉస్మానియా విశ్వవిద్యాలయమునందు పట్టపరీక్షలం దుత్తీర్ణులైన యువకులకు విశ్వవిద్యాలయ పక్షమున గౌరవించుటకును, పట్టము లొసగుటకును సభ సమావేశమయ్యెను. ఇట్టి సభ సంవత్సరమున కొకమారు ప్రతి విశ్వవిద్యాలయ పక్షమునను జరుపబడు చుండును. దీనిని ఇంగ్లీషున "కాన్వొకేషను సభ" యని పేర్కొనెదరు. మన విశ్వవిద్యాలయము పక్షమున జరిగిన ఈ సభ మూడవది.

విశ్వవిద్యాలయ ఛాన్సెలరులగు శ్రీరాజా రాజా యాన్ రాజా సర్ కిషన్ ప్రసాద్ బహద్దురు యమీనుస్సల్తనతు గారు గంభీరమగు నొక యుపన్యాసమును చదివిరి. వీని అచ్చుప్రతులు సభాసదులకు పంచిపెట్టబడినవి. ఈ యుపన్యాసమునందు మహాఘనత వహించిన మన ప్రభువుగారి యౌదార్యమును నవాబ్ మెహదీ నవాజుజంగుగారి సామర్థ్య విశేషములు పొగడబడినవి. మన విశ్వవిద్యాలయము యొక్క ప్రత్యేక లక్షణము ఉర్దూభాషను విజ్ఞాన సాధనముగా నుపయోగించుట యని చూపిరి. ఇంతమాత్రమున విజ్ఞాన సోపానముల దాటితి మనుకొనుట పొరపాటనియు, ముందు పొందవలసిన అభివృద్ధి ఎంతేని కలదనియు వచించిరి. విద్యావంతులకు జీవనాధారములు కల్పింపవలసిన విషయము ముఖ్యమనియు మన విశ్వవిద్యాలయమున సాంకేతిక విద్యలకు మంచి స్థాన మొసగబడవలయు ననియు హిందూదేశముయొక్క రాజకీయ, ఆర్థికాభివృద్ధి, దేశీయులందు మత విద్వేషములును, సాంస్కృదృష్టులును వమసిపోయి ననేకాని ప్రాప్తించజాలదనియు నిర్ణయించిరి. సహకార విద్యాశాఖ, బోధనశాస్త్రవిద్యాశాఖ, ఫ్రెంచి జర్మనీ మున్నగు ముఖ్య పాశ్చాత్య భాషలశాఖ, పరిశోధకశాఖ, ఏర్పరుప బడవలయు నని సెలవిచ్చిరి. ఇప్పుడు భాషాంతరీకరణశాఖవారు పఠనీయ గ్రంథములను కొన్నిటిని ఇంగ్లీషునుండి ఉర్దూలోనికి వ్రాసి పెట్టినంత మాత్రమున చాలదనియు, విశ్వవిద్యాలయ పట్టభద్రులు వాఙ్మయమున నూత్న గ్రంథముల ప్రవేశపెట్టి విజ్ఞానసంపదను వృద్ధిపరచుట తమ ధర్మముగా దలంచవలయు ననియు హెచ్చరించిరి. తుదకు పట్టభద్రులను సంబోధించి చెప్పిన వచనములలో మూడే ముఖ్య విషయములు. (౧) నౌకరి వృత్తిపైన ఆధారపడి యుండక ఇతర వృత్తుల నవలంబింపుడు. (౨) శారీరక స్థితిని బాగు చేసికొనుడు. (౩) స్వయంసహాయసూత్రము నమ్ముడు. అను నవియే ఆ ముఖ్య విషయములు.

ఈ మహోపన్యాసము లోని ప్రధాన సూత్రమొకటి ప్రభుత్వము వారును, దేశీయులును జ్ఞప్తియం దుంచుకొన దగియున్నది. అదేదన

"........కాని ఏదేశమునందైనను విద్యాభివృద్ధి కేవలము ప్రభుత్వముయొక్క ప్రయత్నమాత్రమున జరుగలేదు యూరోపు ఖండములోని విశ్వవిద్యాలయముల మాట చెప్పవలసిన పనిలేదు. బ్రిటిషు హిందూదేశములోని ప్రభుత్వమువారి విశ్వవిద్యాలయములకు కూడ ఎన్నియో విరాళములు గొప్ప గొప్పవి లభించినవి"

ఈ సూత్రమును మహాఘనత వహించిన మన ప్రభుత్వముయొక్క విద్యాశాఖవారి దృష్టి నాకర్షింపదగినది. గడచిన (౧౦) వత్సరములలో విద్యాశాఖవారు చేసిన పని దేశమునందు నూటిలో ముగ్గురుకంటె నెక్కువమందికి వ్రాయను చదువను నేర్పుట కంటె ఎక్కువగ లేదు. నూటికి (౯౭) మంది నిరక్షరులై యజ్ఞాన దశయందున్నారు. వీరికి విద్య లభించి మానవనామమున కర్హులు కావలయు నన్నచో ప్రజాసహాయము లేకుండ సంభవించదు. ప్రజా సహాయమునకాటంకములగు విద్యాశాఖవారి శాసనములను ప్రభుత్వమువారు రద్దుపరచిన గాని ప్రజాసహాయము లభింపదని మాయభిమానము. విద్యాశాఖవారు ఇప్పుడైనను తమ పొరపాటును శ్రద్ధవహించెదరా?

## మద్రాసు కాంగ్రెసు

### కాంగ్రెసు మందిరము: వసతులు

కాంగ్రెసు పెండాలు, ప్రతినిధులకు బసలు మున్నగునవి స్పర్ టాంక్ (Spur Tank) ఎగ్జిబిషనులో వేయబడినవి పనులు చాలవరకు ముగిసినవి. డిసెంబరు ౧౫ వ తేదినాటికి అంతయు పూర్తిచేయుటకు కార్య నిర్వాహకులు నిమగ్నులై యున్నారు.

### నీటి వసతి

కాంగ్రెసు నగరమునందు నీటి వసతులు చేయబడినవి. నీరు గొట్టములు పెట్టుటకు కమిషనరుగారికి రూపాయి లొసంగబడినవి.

### బ్యాంకు

కాంగ్రెసు వారములో ఇండియను బ్యాంకు శాఖ కాంగ్రెసు నగరమున నుండును.

### తంతి: తపాల కార్యాలయము

కాంగ్రెసు నగరమునందు తంతి తపాల కార్యాలయములు పెట్టుటకై ఏర్పాట్లు జరుగుచున్నవి.

### అ. భా. గాయక మహాసభ

అఖిల భారత గాయక మహాసభ భారతీయ గాయక పరికరముల ప్రదర్శించ నున్నారు. ప్రాచీన, ప్రస్తుత, పరికరములన్నియు ప్రదర్శింపబడును. పాటల పుస్తకములు కూడ ప్రదర్శింపబడును. ఈ ప్రదర్శనమునకు పుస్తకములు, పరికరములు సంగీతవారు కమిటీ పేర పంపవచ్చును.

---

### ఆంధ్రవిద్యార్థి మహాసభ

ఈ సమావేశము గుంటూరునందు డిసెంబరు ౬, ౭ తేదులయందు ప్రొఫెసర్ పురుషోత్తం గారి యాధిపత్యమున జరుగును.

### సర్. పి. రాజగోపాల చారిగారు కీర్తిశేషులయిరి

ఇండియా కౌన్సిలు పూర్వ మెంబరులగు వీరు డిసెంబరు ౧ వ తేదిని లండనులో పరమపదించిరి. ప్రభుత్వోద్యోగమునందు నానావిధ గొప్ప యుద్యోగములు చేసి తుదకు ఇండియా కౌన్సిలు సభ్యులయి, అనారోగ్యముచే విరమించిరి.

---

### మద్రాసు సైనికులు

సికింద్రాబాదు నందలి మద్రాసు రెజిమెంటు నుండి ౧౫౦ సైనికులకు వారి స్వగ్రామములకు పోవుటకు సెలవొసంగబడినది. వారు గురువారము నాడు పోయిరి.



### బాలభటులు

జాంబోరీయందు జరుగు గ్రాండు జాంబోరీ (Grand Jamboree) దర్శించుటకు నాగపూరు బాలభటుల ప్రతినిధులు నిన్న ప్రయాణమై పోయిరి.

## ప్రభుత్వావసరములు పూర్తిజేయును

ప్రపంచమందున్న సంస్థలును డాడ్జి బ్రదర్సు కమర్షియల్ బండ్లను ఉపయోగింతురు. జమైకాలోని కింగ్స్టనునందును, బొంబాయినందును, దక్షిణాఫ్రికాలోని కేపుటౌనునందును, తపాల శాఖ వారును ఆస్ట్రేలియా యందలి ఇతర ప్రభుత్వ శాఖలును, ఈ బండ్లను వాడెదరని చెప్పిన తరువతే.

బలమైన ఫ్రేములును, స్ప్రింగులును, బలమైన ఇతర భాగములును నుండుటచే చాల ప్రయోజనకారి యని మీకే తేటపడును. అందుకును ఇతర రకముల బండ్లకన్న డాడ్జి బ్రదర్సు కమర్షియల్ బండ్లు చాల మేలైనవియును, తక్కువ వ్యయమునకే వనియు, ఎల చెప్పెదరు.

ఇతర వివరములు కోరువారును, బండ్లు తెలుసుకొనువారును, దిగువ విలాసమునకు వ్రాయవలయును.




G. No. N. 46. REG. No. M. 2185

గోలకొండ పత్రిక
ట్రూపుబజారు హైదరాబాదు, దక్కను
సంవత్సరమునకు చందా రు. ౭-౦-౦
అర్ధ సంవత్సరము ,, ,, ౩-౧౨-౦
విడి ప్రతి ౦-౧-౬

STAMP

Printed and Published by S. Prathapa Reddy at the Golkonda Press, Troop Bazar, Hyderabad Dn.